# అథ త్రయస్త్రింశోऽధ్యాయః

## శంఖచూడునిపై శివుని యుద్ధసన్నాహము

సనత్కుమార ఉవాచ |

తస్య తద్వాక్యమాకర్ణ్య సురరాట్ తతః | సక్రోధః ప్రాహ గిరిశో వీరభద్రాదికాన్ గణాన్ || 1

సనత్కుమారుడిట్లు పలికెను -

ఆతని ఆ మాటలను విని అపుడా దేవదేవుడు, కైలాసవాసి యగు రుద్రుడు వీరభద్రుడు మొదలగు గణములతో కోపపూర్వముగా నిట్లనెను (1).

రుద్ర ఉవాచ |

హే వీరభద్ర హే నందిన్ క్షేత్రపాలాష్టభైరవాః | సర్వే గణాశ్చ సన్నద్ధాస్సాయుధా బలశాలినః || 2

కుమారాభ్యాం సహైవాద్య నిర్గచ్ఛంతు మమాజ్ఞయా | స్వసేనయా భద్రకాలీ నిర్గచ్ఛతు రణాయ చ |

శంఖచూడ వధార్థాయ నిర్గచ్ఛామ్యద్య సత్వరమ్ || 3

రుద్రుడిట్లు పలికెను -

ఓ వీరభద్రా! నందీ! క్షేత్రపాలా! అష్టభైరవులారా! బలశాలురగు గణములందరు ఆయుధములను దాల్చి సన్నద్ధులు కండు (2). భద్రకాళి తన సేనను దోడ్కొని నా యాజ్ఞ కుమారులిద్దరితో కలిసి ఈ నాడే యుద్ధము కొరకు బయల్వెడలును గాక! నేను ఈ నాడే శీఘ్రముగా శంఖచూడుని వధించుట కొరకై బయలు దేరుచున్నాను (3).

సనత్కుమార ఉవాచ |

ఇత్యాజ్ఞాప్య మహేవానో నిర్య¸ౌ సైన్యసంయుతః | సర్వే వీరగణాస్తస్యాను యయుస్సంప్రహరన్వితాః || 4

ఏతస్మిన్నంతరే స్కందగణ  శౌ సర్వసైన్యపౌ | యయుతుర్ముదితౌ నద్ధౌ సాయుధౌ చ శివాంతికే || 5

వీరభద్రశ్చ నందీ చ మహాకాలస్సుభద్రకః | విశాలక్షశ్చ బాణశ్చ సింగలాక్షో వికంపనః || 6

విరూపో వికృతిశ్చైవ మణిభద్రశ్చ బాష్కలః | కపిలాఖ్యో దీర్ఘ దంష్ట్రో వికరస్త్రమలోచనః || 7

కాలంకరో బలీ భద్రః కాలజిహ్వః కుటీ చరః | బలోన్మత్తో రణశ్లాఘ్యో దుర్జయో దుర్గమస్తథా || 8

ఇత్యాదయో గణ  వానాసై#ృన్యానాం పతయో వరాః | తేషాం చ గణనాం వచ్మి సావధానతయా శృణు || 9

సనత్కుమారుడిట్లు పలికెను -

మహేశ్వరుడు ఇట్లు ఆజ్ఞాపించి సైన్యముతో గూడి బయలుదేరెను. వీరులైన ఆయన గణములందరు మహానందముతో వెంట నడిచిరి (4). ఇంతలో సర్వసైన్యాధ్యక్షులైన కుమారస్వామి, గజాననుడు ఆయుధములను దాల్చి యుద్ధసన్నద్ధులై ఆనందముతో శివుని వద్దకు వచ్చిరి (5). వీరభద్రుడు, నంది, మహాకాలుడు, సుభద్రకుడు, విశాలాక్షుడు, బాణుడు, పింగలాక్షుడు, వికంపనుడు (6).విరూపుడు, వికృతి, మణిభద్రుడు, బాష్కలుడు, కపిలుడు, దీర్ఘదంష్ట్రుడు, వికరుడు, తామ్రలోచనుడు (7). కాలంకరుడు, బలీభద్రుడు, కాలజిహ్వుడు, కుటీచరుడు, బలోన్మత్తుడు, రణశ్లాఘ్యుడు, దుర్జయుడు, మరియు దుర్గముడు (8) మొదలగు శ్రేష్ఠసేనాపతులైన గణాధ్యక్షులు బయలు దేరిరి. వారి సైన్యములు సంఖ్యను చెప్పుచున్నాను. సావధానుడవై వినుము(9).

శంఖకర్ణః కోటిగణైర్యుతః పరవిమర్దకః | దశభిః కేకరాక్షశ్చ వికృతో%ష్టాభిరేవ చ || 10

చతుష్షష్ట్యా విశాఖశ్చ నవభిః పరాయాత్రికః |
షడ్భిస్సర్వాంతకశ్శ్రీమాంస్తథైవ వికృతాననః || 11

జాలకో హి ద్వాదశభిః కోటిభిర్గణపుంగవః | సప్తభిస్సమదశ్శ్రీమాన్
దుందుభో%ష్టాభిదేవ చ || 12

పంచభిశ్చ కరాలాక్షః షడ్భిస్సందారకో వరః | కోటికోటిభిరేవేహ
కందుకః కుండకస్తతా || 13

విష్టంభో%ష్టాభిరేవేహ గణపస్సర్వసత్తమః | పిప్పలశ్చ సహస్రణ
సంనాదశ్చ తథా విదః || 14

ఆవేశస్తథాష్టాభిస్త్వష్టభిశ్చంద్రతాపనః | మహాకేస్సహస్రేణ కోటీనాం
గణపో వృతః || 15

కుండీ ద్వాదశభిర్వీరస్తథా పర్వతకుశ్వ్రభః | కాలశ్చ కాలకశ్చైవ
మహాకాలశ్శతేన వై || 16

అగ్నికశ్శతకోట్యా చ కోట్యాగ్నిముఖ ఏవ చ | ఆదిత్యో హ్యర్ధ కోట్యా
చ తథా చైవం ఘనావహః || 17

సన్నాహశ్చ శ##తేనైవ కుముదః కోటిభిస్తథా | అమోఘః కోకిలశ్చైవ
శతకోట్యా సుమంత్రకః || 18

కాకపాదః కోటి షష్ట్యా షష్ట్యా సంతానకస్తతా | మహాబలశ్చ నవభిః
పంచభిర్మధు పింగలః || 19

నీలో నవత్యా దేవేశః పూర్ణభద్రస్తథైవ చ | కోటీనాం చైవ సప్తానాం
చతుర్వక్త్రో మహాబలః || 20

తాత్పర్యము కొరకై రుద్రసంహితా - సతీఖండలోని 33వ
అధ్యాయమును చూడవలెను.

కోటికోటి సహస్రాణాం శ##తైర్వింశతిభిస్తథా | తత్రతజగ్మస్తథా
వీరాస్తే సర్వే సంగరోత్సవే || 21

భూతకోటి సహస్రేణ ప్రమథైః కోటిభిస్త్రిభిః | వీరభద్రశ్చతుష్షష్ట్యా లోమజానాం త్రికోటిభిః || 22

కాష్ఠారూఢశ్చతుష్షష్ట్యా సుకేశో వృషభస్తథా | విరూపాక్షశ్చ భగవాంశ్చతుష్షష్ట్యా సనాతనః || 23

తాలకేతుష్షడాస్యశ్చ పంచాస్యశ్చ ప్రతాపవాన్ | సంవర్తకస్తథా చైత్రో లంకులీశస్స్వయం పరభుః || 24

లోకాంతకశ్చ దీప్తాత్మా తథా దైత్యాంతకః ప్రభుః | దేవో భృంగీ రిటిశ్రీమాన్ దేవదేవప్రియస్తథా || 25

అశనిర్భానుకశ్చైవ చతుష్షష్ట్యా సహస్రశః | కంకాలః కాలకః కాలో నందీ సర్వాంతకస్తథా || 26

ఏతే చాన్యే చ గణపా అసంఖ్యాతా మహాబలాః | యుద్ధార్థం నిర్యయుః ప్రీత్యా శంఖచూడేన నిర్భయాః || 27

ఆ వీరులందరు వేయి, వంద మరియు ఇరవై కోట్ల గణములను వెంటనిడుకొని ఆ యుద్ధమహోత్సవములో పాల్గొనుటకై అచటకు విచ్చేసిరి (21). వేయి కోట్ల భూతములతో, మూడు కోట్ల ప్రమథులతో, మరియు అరవై ఏడు కోట్ల లోమజులతో (రుద్రగణములలో ఒక జాతి) కూడి వీరభద్రుడు విచ్చేసెను (22). కాష్ఠారూఢుడు, సుకేశుడు, వృషభుడు, పూజ్యుడగు విరూపాక్షుడు, మరియు సనాతనుడు ఒక్కొక్కరు అరవై నాలుగు కోట్ల గణములతో వచ్చిరి (23). తాలకేతువు, షడాస్యుడు, ప్రతాపవంతుడగు పంచాస్యుడు, సంవర్తకుడు, చైత్రుడు, లంకులీశుడు, స్వయం ప్రభుడు (24). లోకాంతకుడు, దీప్తాత్ముడు, సర్వసమర్థుడగు దైత్యాంతకుడు, జ్ఞానమూర్తి యగు భృంగి, శోభాయుక్తుడు దేవదేవునకు ప్రియుడు అగు రిటి (25), అశని, అరవై నాలుగు కోట్ల గణమలతో గూడియున్న భానుకుడు, కంకాలుడు, కాలుడు, నంది మరియు సర్వాంతకుడు (26) మాత్రమే గాక, లెక్క లేనంతమంది మహాబలశాలురగు ఇతర గణాధ్యక్షులు నిర్భయులై శంఖచూడునితో యుద్ధము కొరకు ప్రేమతో బయలుదేరిరి (27).

సర్వే సహస్రహస్తాశ్చ జటాముకుటధారిణః | చంద్రరేఖావతంసాశ్చ నీలకంఠాస్త్రిలోచనాః || 28

రుద్రాక్షాభరణాస్సర్వే తథా సద్భస్మదారిణః | హారకుండల కేయూరముకుటాద్యైరలంకృతాః || 29

బ్రహ్మేంద్ర విష్ణుసంకాశా అణిమాది గుణైర్వృతా ః | సూర్యకోటి ప్రతీకాశాః ప్రవీణా యుద్ధకర్మణి || 30

పృథివీచారిణః కేచిత్ కేచిత్ పాతా చారిణః | కేచిద్వ్యోమచరాః కేచిత్సప్త స్వర్గచరా మునే || 31

కిం బహూక్తేన దేవర్షే సర్వలో కనివాసినః | యయుశ్శివగణాస్సర్వే యుద్ధార్థం దానవైస్సహ || 32

అష్టౌ చ భైరవా రౌద్రా రుద్రా శ్చైకాదశాశు యే | వసవో%ష్టౌ వాసవశ్చాదిత్యా ద్వాదశ తే ద్రుతమ్ || 33

హుతాశనశ్చ చంద్రశ్చ విశ్వకర్మాశ్వినౌ చ తౌ | కుబేరశ్చ యమశ్చైవ నిర్ఋుతిర్నలకూబరః || 34

వారందరికీ వేయి చేతులు గలవు. వారు జటలను కిరీటముగా దాల్చి చంద్రరేఖను అలంకారముగా దాల్చిరి. వారు నల్లని కంఠమును, మూడు కన్నులను కలిగియుండిరి (28). వారందరు రుద్రాక్షలను, హారములను, కుండలములను, కేయూరములను, కిరీటములను ఇతర ఆభరణములను అలంకరించుకొని చక్కని భస్మను ధరించి యుండిరి (29). వారు బ్రహ్మ - ఇంద్ర - విష్ణువులను బోలియుండిరి. అణిమాది సిద్ధులను కలిగి కోటి సూర్యుల కాంతి గల ఆ గణములు యుద్ధ ప్రక్రియలో ఆరితేరియుండిరి (30). వారిలో కొందరు భూమండలమునందు, కొందరు పాతాళమునందు నివసించెదరు. ఓ మునీ! కొందరు ఆకాశమునందు, మరికొందరు సప్త స్వర్గములయందు నివసించెదరు (31). ఓ దేవర్షీ! ఇన్ని మాటలేల? సర్వలోకములయందు నివసించే శివగణములందరు దానవులతో యుద్ధము కొరకై వెళ్లిరి (32). భయంకరాకారులగు అష్టభైరవులు,

ఏకాదశరుద్రులు, అష్టవసువులు, ఇంద్రుడు, మరియు ద్వాదశాదిత్యులు శీఘ్రముగా వెళ్లిరి (33). అగ్ని, చంద్రుడు, విశ్వకర్మ, అశ్వినీదేవతలు, కుబేరుడు, యముడు, నిర్ ఋతి మిరియు నల కూబరుడు కూడ వెళ్లిరి (34).

వాయుశ్చ వరుణశ్చైవ బుధశ్చ మంగలశ్చ వై । గ్రహాశ్చాన్యే మహేశేన కామదేవశ్చ వీర్యవాన్ ।। 35

ఉగ్రదంష్ట్రశ్చోగ్రదండః కోట భస్తథా । స్వయం శతభుజా దేవీ భద్రకాలీ మహేశ్వరీ ।। 36

రత్నేంద్రసారనిర్మాణ విమానోపరి సంస్థితా । రక్త వస్త్ర పరీధానా రక్తమాల్యానులేపనా ।। 37

నృత్యంతీ చ హసంతీ చ గాయంతీ సుస్వరం ముదా । అభయం దదతీ స్వేభ్యో భయం చారిభ్య ఏవ సా ।। 38

బిభ్రతీ వికటాం జిహ్వాం సులోలాం యోజనాయతామ్ । శంఖచక్రగదాపరద్మఖడ్గ చర్మధనుశ్శరాన్ ।। 39

ఖర్పరం వర్తులాకారం గంభీరం యోజనాయతమ్ । త్రిశూలం గగనస్పర్శి శక్తిం చ యోజనాయతామ్ ।। 40

ముద్గరం ముసలం వజ్రం ఖడ్గం ఫలక ముల్బణమ్ । వైష్ణవాస్త్రం వారుణాస్త్రం వాయవ్యం నాగపాశకమ్ ।। 41

నారాయణాస్త్రం గాంధర్వం బ్రహ్మాస్త్రం గారుడం తథా । పార్జన్యం చ పాశుపతం జృంభణాస్త్రం చ పార్వతమ్ ।। 42

మహావీరం చ సౌరం చ కాలకాలం మహానలమ్ । మహేశ్వరాస్త్రం యామ్యం చ దండం సంమోహనం తథా ।। 43

సమర్థమస్త్రకం దివ్యం దివ్యాస్త్రం శతకం పరమ్ । బిభ్రతీ చ కరైస్సర్వై రన్యాన్యపి చ సా తదా ।। 44

వాయు, వరుణ, బుధ, మంగళులు, ఇతరగ్రహములు మరియు వీర్యవంతుడగు కామదేవుడు కూడ మహేశ్వరుని వెనుక నడిచిరి (35). ఉగ్రదంష్ట్ర, ఉగ్రదండ, కోరట, కోటభులు కూడ శివుని వెంట నడిచిరి. వంద భుజములుగల మహేశ్వరియగు భద్రకాళీదేవి స్వయముగా (36). గొప్పరత్నములను పొదిగి నిర్మించిన విమానముపై కూర్చున్నదై ఎర్రని వస్త్రములను, ఎర్రని మాలను ధరించి, రక్తచందనమును పులుముకొని (37). చక్కని స్వరముతో పాడుతూ, ఆనందముతో నవ్వుతూ, నాట్యమాడుచూ, తన భక్తులకు అభయమును ఇస్తూ, శత్రువులకు భీతిని గొల్పుతూ (38) భయంకరము, మిక్కిలి చంచలము, యోజనము పొడవు గలది యగు నాలుకను కలిగినదై నడచెను. శంఖము, చక్రము, గద, పద్మము, ఖడ్గము, ధనస్సు, మరియు బాణములను (39). గుండ్రని లోతైన యోజనము వెడల్పుగల కాపాలమును, ముద్గరమును, రోకలిని, ఆకసమును స్పృశించు త్రిశూలమును, యోజనము పొడవు గల శక్తిని, వజ్రమును, దట్టని డాలును ఆమె ధరించెను. అమె వైష్ణవ, వారుణ, వాయవ్యాస్త్రములను, నాగపాశమును (40, 41), నారాయణ, గాంధర్వ, బ్రహ్మ, గారుడ, పార్జన్య, పాశుపత, జృంభణ, పార్వత (42), మహావీర, సౌర కాలకాల, మహానల, మహేశ్వర అస్త్రములను, యమదండమును, సంమోహన (43), సమర్ధ అస్త్రములను, ఇంకనూ అనేకములగు దివ్యాస్త్రములను చేతులన్నిటియందు దాల్చి, అపుడామె బయలు దేరెను (44).

ఆగత్య తస్థౌ సా తత్ర యోగినీనాం త్రికోటిభిః | సార్ధం చ డాకినీనాం వై వికటానాం త్రికోటిభిః || 45

భూతప్రేతపిశాచాశ్చ కూష్మాండా బ్రహ్మ రాక్షసాః || వేతాలా రాక్షసాశ్చైవ యక్షాశ్చైవ కిన్నరాః || 46

తైశ్చైవాభివృతస్స్కందః ప్రణమ్య చంద్రశేఖరమ్ | పితుః పార్శ్వే సహాయో యస్సమువాస తదాజ్ఞయా || 47

అథ శంభుస్సమానీయ స్వసైన్యం సకలం తదా | యుద్ధార్థమగమద్రుద్రశ్శంఖచూడేన నిర్భయః || 48

చంద్రభాగా నదీతీరే వటమూలే మనోహరే | తత్ర తస్థౌ మహాదేవో దేవనిస్తారహేతవే || 49

ఇతి శ్రీ శివమహాపురాణ రుద్రసంహితాయాం యుద్ధఖండే మహాయుద్ధయాత్రా వర్ణనం నామ త్రయస్త్రింశో%ధ్యాయః (33).

ఆమె భయంకరాకారులగు మూడుకోట్ల డాకినిలతో, మరియు మూడు కోట్ల యోగినులతో సహా వచ్చి అక్కడ నిలబడెను (45). భూత, ప్రేత, పిశాచ, కూష్మాండ, బ్రహ్మరాక్షస, వేతాల, యక్ష, కిన్నరులతో (46) చుట్టువార బడియున్న కుమారస్వామి తండ్రియగు చంద్రశేఖరునకు ప్రణమిల్లి ఆయన ఆజ్ఞచే ఆయనకు సహాయకుడై ప్రక్కనే నిలబడెను (47). అపుడు ఉగ్రరూపుడు, నిర్భయుడు నగు శంభుడు తన సైన్యమునంతనూ తీసుకొని శంఖచూడునితో యుద్ధమునకు వెళ్లెను (48). దేవతల నుద్ధరించుట కొరకై మహాదేవుడు సుందరమగు చంద్రభాగానదీ తీరమునందు వటవృక్షము యొక్క మూలమునందు మకాము చేసెను (49).

శ్రీశివమహాపురాణములో రుద్రససంహితయందలి యుద్ధఖండలో మహాదేవుని యుద్ధయాత్ర వర్ణనమనే ముప్పది మూడవ అధ్యాయము ముగిసినది (33).